# శ్రీ రామమోహనఆయుర్వేదధర్మవైద్యశాల అండ్ ఫార్మసీ

## బెజవాడ. స్థాపితము: 1915

శ్రీ రామమోహన ఆయుర్వేద ధర్మవైద్యాలయము 1 వ ఆగష్టు 1915 సం॥ రమున శ్రీ॥ శే॥ శంకర వెంకటాద్రియ్యపంతులు, టొడ్డపాటి వెంకటప్పయ్యపంతులుగార్లచే స్థాపింపబడినది. ఈ ధర్మ వైద్యాలయము క్రమాభివృద్ధి నొందుచు అనేక వేల బీదలకు కల్పవృక్షమై ప్రజాసేవచేయుచున్నది. ధర్మవైద్యశాలకు వలయు ఔధములను తయారు చేసికొనుచు,కోరినవారికి శాస్త్రీయమైనట్టియు,నమ్మకమైనట్టియు, ఔషధములను సప్లయిచేయునుద్దేశముతో దీనికనుబంధముగా నొకపార్మశీ నెలకొల్పబడినది. యీపార్మశీయందు తయారుచేయబడిన ప్రతిఔషధమును ధర్మవైద్యశాలయందు అనేకమంది రోగుల కుపయోగించి గుణముచేయుచున్నట్లు పరీక్షింపబడినది. యీఔషధముల అమ్మకముపై వచ్చు ఆదాయము తిరిగి ధర్మవైద్యశాలాపోషణమునకై వినియోగింపబడుచున్నది. ఈవైద్యశాల బెజవాడ, గవర్నరుపేటయందలి బందరురోడ్డుపై ఉన్నతమగు స్వంతభవనమునందున్నది. యీధర్మవైద్యాలయమునందు ప్రతిదినము సుమారు 200 మంది రోగులు ఉచితముగ చికిత్స నొందుచున్నారు. వలయువారు విలువగల ప్రసిద్ధౌషధములను కూడ కొని వాడుకొనుచున్నారు. ఆయుర్వేదచికిత్సయందు నిపుణులును, మంచి అనుభవముగల ఆయుర్వేదవైద్యులు దీనియందు పనిచేయుచున్నారు. తమకు కావలసిన సలహాలను, చికిత్సలను వీరివలన నుచితముగా పొందవచ్చును. ఔషధములన్నియు యథాశాస్త్రీయముగా తయారు చేయించబడుచున్నవి. ఇపుడు సుమారు నలుబదివేల రూప్యముల విలువగల నాల్గువందల ఔషధములు సిద్ధముగానున్నవి. ఇన్ని ఔషధములు నమ్మకముగా ఒకచోటను లభించుట దుర్లభము. దేశమునందలి పలువురు ప్రముఖులు యీఔషధములను కొనియాడుచున్నారు. యీఫార్మశీయందలి ఔషధములను ఉపయోగించు విధానమును, పథ్యమును, అనుపానములును చక్కగా తెలియుటకై అనుపానపథ్యమంజరిని ప్రకటించియున్నాము. ఇన్ని ఔషధములను యింతపెట్టుబడితో తయారుచేయుటకు సామాన్యవ్యక్తులకు సాధ్యముకాదు. యీఔషధములను నిర్దుష్టములుగా తయారుచేసి వైద్యులకెల్లరకు నందుబాటులో నుండునటుల స్వల్పధరలకు విక్రియించుచున్నాము. ఈఔషధములపై వచ్చు ఆదాయము యెవరిస్వార్థమునకుగాని వినియోగింపబడక తిరిగి ధర్మవైద్యశాలాపోషణమునకై వినియోగింపబడును. దేశీయులెల్లరు యీఔషధములను కొని తమన్మూలమున ఆయుర్వేదాభివృద్ధికిని, యీధర్మవైద్యశాలకును తోడ్పడ ప్రార్థితులు.

ఇట్లు,
కోట వెంకటాచలం ఆనరరీ సెక్రిటరీ.

ఔషధములు, యితరవిషయములు వలయువారు:— అనివార్యవలయును.
సెక్రిటరీ, శ్రీరామమోహన ఆయుర్వేద ఫార్మశీ, బెజవాడ.

(1) సిద్ధమకరధ్వజము తు॥ 1కి రు 40—0—0.

ఇందు అర్థభాగము బంగారము భస్మరూపమున కలదని ప్రాచీనిచ్చెదము. యుక్తానుపానములచే సేవించిన నపుంసకత్వము, నరముల బలహీనత, శుక్లనష్టము, బుద్ధిమాంద్యము, క్షయ, దగ్గు, శీఘ్రస్ఖలనము, అతిమూత్రము, మధుమేహము, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము, జీర్ణించిన సుఖవ్యాధులు, పక్షవాతము శ్వేతరక్తప్రదరములు, సమస్తప్రమేహములు, పాండువు మొదలగు వ్యాధులను పారదోలును.

(2) మకరధ్వజము తు 1కి రు 20—0—0.

ఇందు 8వవంతు బంగారము చేర్చబడి పైగుణములనే కలిగియున్నది.

(3) రక్తమారేశ్వరము, తు 1కి రు 10—0—0

ప్రమేహము, రక్తపిత్తము, స్త్రీల తెలుపు, ఎరుపు, పసుపు నలుపు వర్ణముగల కుసుమవ్యాధులకు.

(4) క్రిమవృద్ధిలక్ష్మీవిలాసరసము తు 1కి రు 10—0—0

ఇయ్యది క్షయరోగులకు అమృతమువంటిది. క్షయ, శ్వాసకాసలు, జీర్ణజ్వరము, శరీరకృశత్వము, రక్తహీనత, పాండువు మొదలగువానిని పోగొట్టును. శరీరబలము, కాంతి, శుక్ర ఓజస్సులను వృద్ధిజేయును. ఇందు బంగారము, మంచిముత్యములు, మంచిపగడములు మొదలగు విలువగలవస్తువులు చేరియున్నవి. అన్నితత్త్వములకు అనుకూలించును.

(5) రసరాజరసము తు॥ 1కి రు 10—0—0

ఇది స్త్రీలకు నరముల బలహీనతచే కలుగు హిస్టీరియా అను రోగాపస్మారమునందు అద్భుతమైన గుణమును యివ్వగలదు. మరియు నరముల బలహీనత, గుండెదడ, వాతవ్యాధులను నివారింపజేయును.

(6) మహాకనకసుందరరసము తు॥ 1కి రు 60—0—0

ఇందు సగము బంగారము భస్మము చేరియున్నది. క్షయరోగమునందు చెప్పిన సకలౌషధములకు నాయకమణివంటిది యీయౌషధము. పాండువు, కామిల, శ్వాసకాసలు, జీర్ణజ్వరములను పోగొట్టి శుక్రము, బలము, వర్ణము, కాంతి, పుష్టి వీనిని కలుగజేయును

(7) వసంతకుసుమాకరము తు॥ 1కి రు 20—0—0

అతిమూత్రము, మధుమేహము మొదలగు ఇరువది ప్రమేహములు, స్త్రీలకు కలుగు శ్వేతరక్తప్రదరములు, కృశించుట, కాళ్ళుచేతులు మంటలు, కోష్ఠ లాగుట, ఎల్లప్పుడు శరీరము వెచ్చగానుండుట, జ్ఞాపకశక్తి లేకపోవుట, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, మేహపిటకములు, క్షయ, అతిశీఘ్రస్ఖలనము, నోటిపూత, గుండెదడ, కడుపునొప్పి మొదలగు సమస్తవ్యాధులను ఖండించును. బంగారము, మంచిముత్యములు, కస్తూరి మొదలగు విలువగల వస్తువులను చేర్చి తయారుచేసియున్నాము.

(8) పూర్ణచంద్రోదయము తు॥ 1కి రు 12—0—0

పాండువు, గుండెదడ, క్షయ, అజీర్ణము, కాళ్ళుచేతులు మంటలు, ఇంద్రియస్ఖలనము, వాంతులు బలహీనత, దగ్గు ఒగర్పు వీటిని నశింపజేసి వీర్యవృద్ధిని స్తంభనమును గలుగజేసి మనోల్లాసము నిచ్చును.

(9) త్రైలోక్యచింతామణి తు॥ 1కి రు 20—0—0.

ఇందు వజ్రములు కెంపుల భస్మములు చేరియున్నవి. ప్రాణావసానకాలమందు దీని నుపయోగించిన యెడల తప్పక ప్రాణదాన మొసగును. ఎంతటి శ్లేష్మమైనను వెంటనే ఖండించును. వాతవ్యాధులు శూల క్షయ కాస శ్వాస మొదలగువ్యాధులను నశింపజేయును.

సువర్ణక్రవ్యాదరసము తు॥ 1కి రు 4—0—0లు. బాలచంద్రోదయము తు॥ 1కి 2—0—0లు